ఓం శ్రీ పరమాత్మనే నమః

సంతరావూరు శ్రీ లక్ష్మీచెన్నకేశవస్వామివారి అనుగ్రహపాత్రుడగు

కోటా వెంకటకృష్ణదాసుచే

వ్రాయబడిన

# శ్రీలక్ష్మీచెన్నకేశవశతకము.

ఇది

అచ్యుతుని శ్రీరామశాస్త్రుల వారిచే

పరిష్కరింపబడి

బెజవాడ కాపురస్థులగు

దొంతరాజు వెంకటప్పయ్య గారిచే యీసువార్త

ప్రకటింపబడియె.

వేటపాలెం స్టేషను, సంతరావూరు.

---

బెజవాడ వాణీ ముద్రాక్షరశాలయందు

బి. కే. స్వామిచే

ముద్రింపబడెను.

---

వెల రు 0—4—0 1920

    

సంతరావూరియందు నూతనముగా వేంచేసియుండే శ్రీ చెన్న
కేశవస్వామివారి ఆజ్ఞానుసారమైన

# పీఠిక.

ఆర్యులారా !

నిత్య సత్యగరిష్ఠులగు బుధసత్తములకు శ్రీ స్వామివారి ఆజ్ఞానుసారము పునః పునః ప్రణామంబు లాచరించిసేయు విజ్ఞాపన.

సుజనధ్యేయులారా! స్థిరమై, పరమానందంబై, భక్తి శ్రద్ధానురాగంబై, అంకస్థితార్థిమేటియై యొప్పుచున్నటువంటి యీమోక్ష సామ్రాజ్యం బనుభవింపజాలనివారి కిహపరసౌఖ్యంబులు లభింపనేరవు. సులభోపాయంబునవచ్చు ధనంబు పరిగ్రహింపని వారికి మరియొండు విధమున విత్తము సముపార్జించుట సులభసాధ్యము కానగదా ? ఇది శ్రీస్వామివారి ఆజ్ఞయని తెలియవలయును.

శ్రీ స్వామివారు చెప్పినటువంటి క్షేత్రమహాత్మ్యం బెరిగించెద.

విజ్ఞాననిధులారా ? లోగడ ప్రమాదీచనామ సంవత్సర వైశాఖ శు ౧౧ లు రోజున శ్రీవైకుంఠమందు జగజ్జననియగు భార్గవిమానసంబున లోకరక్షణార్థంబు శ్రీ స్వామివారినిగూర్చి యనేక తెఱంగుల నారాధననొనర్చిన విశ్వంభరుఁడు సంతసించి, రమా? నీవు దేనినిమిత్తంబు స్తోత్రము చేయుచున్నావు. నీ యిష్టార్థంబునుగుమిచ్చెదనని పల్కిన తద

నంతరం బాయిందిర, నాథా? యిప్పుడు మన మిరువురము మర్త్య
లోకంబునందు గల యష్టోత్తర దివ్యక్షేత్రంబు లెల్లంజూచి వచ్చునట్లుగ
నొక వరంబును, ముందు నాకు కావలసినపుడు మరియొక వరంబును
ననుగ్రహింపవేడెదనన నామె కోరినవిధమునకటుల వరంబునిచ్చి ప్రథ
మంబున ననుగ్రహించి, వరసానుకూల్యమునకంయు మర్త్యలోక పుణ్య
క్షేత్ర దిదృక్షాయత్తచిత్తులైవధూవరులిరువురును గరుడారూఢులైకురు
పాంచాలంబులాదిగాగల యనేక దేశంబులన్నియు బదరీక్షేత్ర,
సేతు, వాదిగాగల పుణ్యక్షేత్రంబుల న్గాంచుచు ఆయాధర్మంబులు పరి
శీలించుచు కైలాసగిరిమీదుగా, కరిశిఖరప్రాంతములకేగుచుండ మహా
రణ్యంబు మధ్యనొక ఋషిశ్రేష్ఠుడాచరించు తపస్సునకు నామునిసత్త
మునిందగు సమాధానమొనర్చి శ్రీ రంగమునకేగితిరుగ, తిరుమల
గడచి సంతరావూరిమీదుగ వెళ్ళుచుండ లోకమాతయగు శ్రీహరి
ప్రియ, మన దేశముయొక్క యజ్ఞానమునకు కొంత శంకించి నాథా
మును నేపాలకడలియందు వేసిన ద్వితీయవరరాజం బిచ్చుట పుణ్యక్షే
త్రంబుగా నుండునట్లనుగ్రహించవలెనని వేడెను. ముకుందుండు దా
కిటుల కోరెదవన స్వామీ మనమిప్పుడు తిలకించిన దేశంబులన్నియును
దివ్యక్షేత్రంబుల సామీప్యమునందునటం జేసి యాయాదివ్యనామంబుల
చేత ఆయా దేశంబులందు దేవరివారిని మిక్కిలి భక్తిశ్రద్ధానురాగులై
గొలిచి తరించుచున్నటువంటి వారలు ఈ దేశంబునందున? పురాణో
క్తంబయిన తమ ప్రసిద్ధనామంబు వెల్లడికానందున భక్తిశ్రద్ధలతో మిము
సేవించువా రరుదుగానున్నారు. గాన నో మహానుభావా, లోకమందు
పుడమికి రాజయిన వాడు తనరాష్ట్రమును వేరు వేరు భాగములు
గావించి ఆయా భాగములను ఎట్టి యుపద్రవములు రాకయుండ కాపా
డుచుండును, త్రిలోకరక్షకులగు మీరు భక్తాగ్రగణ్యులను రక్షించువి
ధగాన నిచ్చటవేంచేసి యీక్షేత్రమందు సేవనొనర్చు భక్తులకెల్లకల్ప
వృక్షమువలె కోరికలీడేర్చుచు ఈసంతరావూరను క్షేత్రమునందు నూ
తనముగా కలిగీతలు కల్పించి యీగీతలు పారాయణనొనర్చు తమ దా
సుల కెల్ల సులభోపాయంబున నిత్యనైమిత్తికాముల ఫలంబు సిద్ధించున

ట్లు సేయవలసినదిగా లోకమాతయగు నిందిరాదేవి ప్రార్థించినంబాది శ్రీమన్నారాయణుం డిట్లనియె. పద్మాలయా! కలియుగంబున నాలుగవ పాదధర్మంబు నటించినను మోక్షప్రాప్తి సులభంబుగా పొందగలరు. అందువలన చతుర్థధర్మానుకూలంబై కలియుగాను సంధానంబై యుండెను. అయినను నీ యిష్టానుసారము కలిగీతలనొనర్చెద. జనులకెల్లరకు బోధగానొనర్చుట కెవరినేర్పరచవలెనన, మంగళ దేవతాస్వరూపిణియగు నాతల్లి యిట్లనియె. లోకబాంధవా, సర్వవ్యాపకుడవగు మహానుభావుడవు. తమకు తెలియని యంశములున్నవా ? అయినను నాయందలి కటాక్షముచే నన్నడిగినారు గనుక మనవియొనర్చెద. మును జన్మంబున నొక శివాలయంబు నిర్మించి యచ్చట పరిణయపరికరంబులు పూర్తిగాకముందే యవసానకాలంబు సంప్రాప్తించిన నామృత్యుంజయుని ప్రార్థించి యాతనివలన "నీవు ముందుజన్మంబున సతతము శ్రీహరి పాదధ్యానపరతివై హరి కరుణాకటాక్షంబు పొందెద"వని వరంబుబడసియున్న తమ భక్తుండొకండు గలండు. కావున వానిని తమ సన్నిధానమునకు రప్పించి మోక్షప్రసాదంబను ఈకలిగీతలు బోధించి మీరు చెప్పవలసిన వస్తువును సాంగోపాంగముగా నుపదేశింపవలెనని విన్నవించెను. అంత శ్రీస్వామివారు కార్యానుకూలముగనే వచ్చినారుగాన శ్రీ మహాలక్ష్మి ప్రార్థన నంగీకరించి భక్తుల నుద్ధరించు తలంపున ఆ రాత్రివేళ పోతా వెంకటకృష్ణదాసను నామంబుగల నొక భక్తవరునకడ కరుగుదెంచి స్వప్నంబున సాక్షాత్కరించి, ఓ భక్తా! నీవు నే నిర్దేశించిన ప్రదేశంబున న్యాసము సేయుము నన్ను రక్షించెదమని యానతిచ్చి తిరోధానము నొందెను. తదనంతరం బాభక్తుండు మేల్కాంచి దిక్కులుచూచి యేమియును తోచకమున్ను స్వామివా రాజ్ఞాపించిన ప్రదేశమున కరుదెంచి ప్రాపంచిక వ్యవహారములయం దిష్టములేనివాడై శరీరము తెలియక యన్నము, పానీయము, సుషుప్తి మొదలగు శరీరపోషకవర్గములెల్ల త్యజించి, స్వామివారి ఆవేశంబుచేత మానసధ్యానము నిరంతరము నామహానుభావుడగు అచ్యుత చరణారవిందములయందే కాగ్రచిత్తతతో మనస్సునుండగ యనంతరమున శ్రీ స్వామివారు

ఆషాఢ శు ౧౧ లు రోజున సాక్షాత్కరించి మోక్షప్రసాదంబను నొక ప్రబంధంబు బోధించి యీ ప్రబంధంబును వెల్లడించి నీవు నాకు భక్తుడవుగా నుండవలసినదని నియమించెను. మరియు నీ క్షేత్రమున ముందు జరుగవలసిన విధులు దెల్పి యీ క్షేత్రమున శివదు భక్తి శ్రద్ధలతో నరుగుచెంతురో వారలకును ధనుర్మాసంబున నేకోవాసులై నా లీలలు వినుచు వ్రతము సల్పుదురో వారలకును వైశాఖ శుద్ధమాఘు కల్యాణమున కరుదెంచువారలకు నాచే బోధితమైనటువంటి యీ మోక్ష ప్రసాదంబు నిత్యానుసాయులై పఠించువారికిన్ని సులభానురాగంబున నే యిహ పరసౌఖ్యంబు లిచ్చుచున్నాడ నని దీక్షజూపి అదృశ్యులైరట.

ఇది—"శాస్త్రదృష్టం గురువాక్యంతృతీయం ఆత్మనిశ్చయం" అను భవాతిశయంబునను ఆత్మనిశ్చయమునను వ్రాయుచున్నాడను.

ఇట్లు పోకా వెంకటకృష్ణదాసు శ్రీ స్వామివారి ఆజ్ఞానుసారమున యీ మందిరముననే నివసించిరి. కొంతకాలమునకు మా నివాసస్థానమగు గుంటూరు మండలములోని తాడికొండగ్రామము, అస్మద్ద్వార దేహంబునం దొక్క మంత్రగ్రహం బావేశమయ్యె. తన్నివారణార్థంబనేక దేశములు తిరిగి తిరిగి వేసారి మా శ్వశురనివాసగ్రామమగు సంతరావూరు వెళ్ళితిమి. ఒకనాడు శ్రీ స్వామివారి సన్నిధికి వెళ్లగ నచ్చట ఈ భక్తుం డుండెను. శ్రీ స్వామివారు చెప్పిన గ్రంథంబును భక్తుని యొద్ద నుండెను. దానిలో రక్షించే చరమానురాగంబు ప్రతిజ్ఞ వినగా నాకు మహాకుతూహలంబు గలిగి మా సమాచారం బంతయును నా భర్తవరునకుఁ దెల్పి మేము సేయవలసిన విధు లేమని యడుగగా అంతట వారు " మీ వధూవరు లిరువును శిరస్నానులై యుపవసించి స్వామివారిసన్నిధినుండు డని తెల్పిరి. మేము, పేదకు పెన్నిధిదొరకిన ట్లాలాగుననే యుంటిమి. మూడవరాత్రి శ్రీస్వామివారు మా స్వప్నమున సాక్షాత్కరించి మీ కష్టంబు లీడేరును. ఇకమీద నిహ, పరసౌఖ్యము లబ్బును. నాకు భక్తులుగానుండి, నేను చెప్పి

నటువంటి కలిగీతలను ఈ మోక్ష ప్రసాదంబను నా మహాత్మ్యమును ముద్రణ వేయించి, లోకమునందు నేను దెల్పినపుడు వెల్లడిచేసి నాభక్తునకు కార్యానుకూలుడవై యుండమని తెల్పి తిరోధానము నొందిరి. అంత మేము పరమసంతుష్టాంతరంగులమై యీవాక్యంబులు శ్రీస్వామివారి భక్తునకుం దెల్పి యింటికి వచ్చితిమి. నాటినుండి కష్టంబు లీడేరి యనేక యిష్టప్రాప్తులుబడసి సుఖించుచు స్వామివారి ఆజ్ఞల కెదురుచూచుచు వారి దయాంతఃకరణప్రసాదమువలన సుఖంబుగా యున్నవారము. యిటులే యింక ననేకులు సుఖములు బొందినవారలై స్వామివారికి నిత్యానపాయులై కైంకర్యంబు లొనరించుచున్నవారలు.

ఇట్లుండగా నీ సిద్ధార్థినామసంవత్సర పుష్య శు ౧౧ లు రోజున భక్తుండైన పోకా వెంకటకృష్ణదాసునకు స్వప్నమున సాక్షాత్కరించి ఓభక్తాగ్రేసరా! నీవు నాపేర నొక్క శతకం బొనగూర్చుమన యా భక్తుండు స్వామీ; కేవలము తమ కరుణయే శతక మొనర్చ నట్లొర్చునదేగాని నా యల్పవిద్యాజ్ఞాన మెంతమాత్రము నుపయోగించదని ప్రార్థించిన శ్రీ స్వామివారు నీవు పల్కిన పల్కు లన్నియు భక్తిపదాగ్రములై, సంసారఘోరాంబుధికి నావయై, హృద్యములగు పద్యము భద్రములై, భవనాశములై యుండును. గాన రచింపుమనిరి. అంత శ్రీస్వామివారి యాజ్ఞానుసారముగా యా భక్తుం డీ శతకం బొనర్చె.

తదనంతరంబున శ్రీ స్వామివారు నా స్వప్నమున సాక్షాత్కరించి భక్తా! నీవు మునుపు నేను జెప్పినటువంటి క్షేత్రమహాత్మ్యంబున గొంత పీఠిక వ్రాసి నా భక్తుండు రచించిన శతకంబును ముద్రణ మొనర్చి లోకంబున భక్తుల కెల్ల ప్రీతిని కలుగ జేయుమనియును, ఈ విధముగా నీ క్షేత్రమహాత్మ్యమును ఎల్లరకు వెల్లడి సేయమనియు నియమించిరి. ఇంతియేగాక యీ శతకంబు పఠించినవారికి సకల సౌఖ్యంబులు నొసగుదునని తెల్పి నా క్షేత్రమునకు వచ్చి

ముక్కోటి ఏకాదశిరోజున జాగరణ చేసినందువలన ముఖ్యమైన మోక్షప్రాప్తి కలుగును. రామావతారంబున నా పాదస్పర్శవల్ల అహల్యకు శాపవిమోచన కలిగి శుభంబు పొందినట్లైవడి నా నూతన క్షేత్రమై యున్న యీ క్షేత్రమునకు భక్తిశ్రద్ధలతో యెవ్వరు అయినను ఏ కాలమందు అయినా వచ్చి నన్ను సేవించుచున్నారో వారివారి కష్టంబులు దొలంగి మోక్షప్రాప్తి బొందగలరని దెల్పినటువంటివారలై తిరోధానమునొందిరి. యిది సత్యము సత్యము. తదనంతర మీ పీఠిక శ్రీ లక్ష్మీ చెన్నకేశవస్వామివారి యాజ్ఞానుసారము వ్రాసి శ్రీ వారి కరుణచే శతకంబు ప్రసిద్ధిజేసినటువంటివాడినైతి. పెద్దలు దోషంబులు మన్నింప వేడెదను.

శ్రీ పరమేశ్వరార్పణమస్తు.

ఇట్లు విధేయుడు,

దొంతరాజు వెంకటప్పయ్య.



జయలక్ష్మి. శ్రీ చెన్నకేశవస్వామివారు. భూదేవి.

శా॥ శ్రీరామం భవసన్నుతాఖిలయ, శ్రీ ♦ సీతామనోనాయకం
శ్రీ రామాద్వయతారకాఖ్యజనకా ♦ శీర్వార్ధ, హృత్కంజనం
శ్రీ రంగేశ్వరపుండరీకనయనం ♦ శ్రీ జానకీరాఘవం
శ్రీ రామానృతమర్దనం హరి నమో ♦ శ్రీ చెన్నకేశాన్వితం॥

ఉ॥ తప్పులు నొప్పులు న్నెరుగ ♦ దాశరథే నిను నమ్మినాడ నే
నిప్పుడు బెక్క పద్యములు ♦ నీ తులసీవనమాల యెప్పుడున్
నొప్పగ స్వీకరించు కృప ♦ కెప్పుడు పాత్రుని జేసి నన్ను నీ
చెప్పను దేల్చుమయ్య సుర♦ధివర శ్రీహరి చెన్నకేశవా॥ ౨

ఉ॥ ఏరులు నెన్ని యుండిన ఘ♦నాంబుధిదాల్చినరీతి నీవు నా
దారులు నన్నియున్న పర♦దైవము నీవని సన్నుతింపగా
మారకసేయుమయ్య హరి♦మాధవమంజులమానసీకమా
కోరికదీర్చుమయ్య నిను ♦ కోరి భజించితి చెన్నకేశవా। 3

—* శ్రీ లక్ష్మి. *—

ఉ॥ పాలసముద్రపట్టి హరి♦పావనవక్షనివాసలక్ష్మి నీ
జాలముసేయకమ్మ నిను ♦ సన్నుతి జేసితి సద్గుణాంశ నీ

మేలును జూపవమ్మ నను ♦ మేదిని బ్రోవను నన్ను లెవ్వరో
బాలుడ నేరనమ్మ హరి ♦ పంచెను జేస్తుము నీకు మ్రొక్కెదన్॥



సరస్వతీదేవి.

ఉ॥ పద్మజు కొమ్మ వాణి నిను ♦ ప్రార్థన జేసెదనమ్మ నీవు నా
హృద్యగమందునం నిరత ♦ యుర్వని నా మనమందు శ్రీ హరిన్
పద్యము సేయుచుండగను ♦ భక్తిని గూర్పుము పావనావళిన్
విద్యలనాదితల్లి ఘన ♦ వీణాసుపాణిని నీకు మ్రొక్కెదన్॥



గణపతి.

ఉ॥ రుద్రకుమార గౌరిసుత ♦ రూపు గజాధిపుమోముచంద్ర నీ

రుద్రముమాని సూరిజన♦రూఢినిదాల్చియు నాకు నీవు ఘన
భద్రపరాంశమున్గలుగ ♦ పాటల నాటల నైన శ్రీహరిన్
నిద్రనునైననామదిని ♦ నిల్పు వినాయక నీకు మ్రొక్కెదన్ ॥



ఫ్రిసన్నాంజనేయులు.

ఉ॥ మారుతి యాంజనేయా సుర♦మాధనతన్మయ మానసీకమా
సూరిజనాగ్ర వాయుసుత ♦ సుందరమూర్తజనేశ నాకు నీ
భూరిభయంకరాగ్రము ♦ పుణ్యసురూపముజూపి బ్రోవుమా
వారధిబంధనార్య దయ♦వాసిని నుంచుము నీకు మ్రొక్కెదన్ ॥

---

ఉ॥ ఆర్యులవల్ల నీదుమహి♦మాంబుధిపింటిని యార్తరక్షకా
కారుణవంచు నిన్ను విన ♦ యన్యులవేశను నేమిజేసినన్
ధారుణినీవెనన్ను ఘన♦దైత్యకులాంతక దంతిరక్షకా
భూరిదయాసముద్ర భువి♦భూసురవందిత చెన్నకేశవా॥ ౮

ఉ॥ పుట్టిననాటనుంచి ఘన♦పుణ్యులదూషణజేసియుంటి నా
పుట్టిమునింగినట్లు ధర ♦ భూతములన్నిటి హింసజేసితిన్
మట్టుమితంబులేక కొర♦మాలినచేష్టలు మాననైతి నీ
గట్టునజేరినాడ నను ♦ గావుము శ్రీహరి చెన్నకేశవా॥

ఉ॥ శ్రీహరి నిన్నుజూచి తమ♦శ్రీమను యార్తిని లక్ష్మిలోకమున్
జోహులనెల్ల బ్రోచుటకు ♦ సూరిజనాన్వయజూచివత్తమూ

బాహుబలాకృతిన్వడల ♦ ప్రార్థనసేయగ పారమార్థికం
సాహసయాత్రలున్గడచి ♦ సంతతరాపురి చెన్నకేశవా॥ ౭

ఉ॥ ఈశిశ దివ్యనామమును ♦ యిశ్చట లేమియు జేసి యార్తిచే
సాధుజనంబుల న్గరుణ ♦ చెయ్యను బ్రోవను సంతరాపురన్
మేదిని చెన్నకేశుడను ♦ మేలగు నామము జెందితీవు నన్
బోధనొనర్చి మోక్షము వి♦భో! దయచేసితి చెన్నకేశవా॥

ఉ॥ గౌతమదారనున్గరుణ ♦ గాచినరీతిని బ్రోతునంచు నీ
భూతలమందు నన్ సుమతి ♦ పుణ్యుల బ్రోవను సంతరాపురన్
ప్రీతిని నిల్చినాడనని ♦ ప్రేమను కావ్యము బల్కితీవు నే
నాతురమంద నేల యిక ♦ నాపదలందున చెన్నకేశవా॥ ౮

ఉ॥ ఈశ సమస్తలోకజగ♦దీశ పరేశ పురాణవందితా
భూసురపారతంత్రమున ♦ భూపతిరూపము దాల్చి ధామశీన్
వాసము జేసి నిర్జరుల ♦ వానరమూర్తుల నేలినట్లు నన్
దాసుని జేసికొమ్ము ఫల♦దాయక శ్రీహరి చెన్నకేశవా॥ ౯

ఉ॥ భాస్కరరశ్మి లోకముల ♦ బంధురచీకటి మాన్చినట్లు నా
శుష్కదరిద్రపాపములు ♦ చూరలు బొందగ నీదు భక్తిచే
పుష్కరవార్ధి దేల్చి జయ♦పుంగవ నీపదపంకజంబులన్
నిష్కపటార్చనంబునను ♦ నిల్పుము శ్రీహరి చెన్నకేశవా॥ ౧౦

ఉ॥ రాజులమేటివయ్యు రణ♦రంగనిశాచరఘాతివయ్యు యీ
భూజననేతవయ్యు పర♦భూపతి నీవు గదయ్య నీవు నా
సాయము గాగదయ్య భవ♦సాగరమీదగ జాలవయ్య నీ
తేజము జూపుమయ్య జగ♦దీశ్వర శ్రీహరి చెన్నకేశవా॥ ౧౧

ఉ॥ ఎంగిలిపండ్లొసంగినను ♦ యేహ్యము లేకను నారగించి యా
యంగనయైన యాశబరి యార్తినిదీర్చిన రామచంద్ర యో
సంగరమేటి దర్పతమ♦చాటున జేరితి యాదరింపు నన్
భంగమొనర్పకయ్య శ్రిత♦బాంధవ శ్రీహరి చెన్నకేశవా॥ ౧౨

ఉ॥ బాలుని జూచి ముద్దిడక ♦ బాయగ జాలని మాతకైవడిన్
వీలుగ భక్తులందు కడు♦ వేడుకనుందువు గాన నీవు నన్

జాలము సేయకయ్య యల ♦ జాలరిచిక్కిన మీనమట్టులే
మేలునుదోచదామె యము♦నీసముఖాటికి చెన్నకేశవా! ౧౩

ఉ॥ అంబుధిలోనజొచ్చిన మ♦హాద్భుతభూతములెల్లనంటుచున్
బింబమును జారజీరుచును ♦ భీతిని బాధలబెట్టునట్లు నన్
దంభము తోడ సంసృతిని ♦ దారయు తల్లియు దండ్రియున్సుతుల్
గుంభము జేర్చిన న్భయము♦గూర్పకు శ్రీహరి చెన్నకేశవా! ౧౪

ఉ॥ కాలకులాంతకుండు కదు ♦ కన్నులనిప్పులు రాలుచుండు ధర్
పాలను పాపుచెండు ధర♦బాయక యెప్పుడు జూచుచుండు నన్
కాలము గాచియుండు హరి ♦ కాననసీమల ద్రోయకుండు నీ
లీలలు మానకుండ వర♦మీయవె శ్రీహరి చెన్నకేశవా! ౧౫

ఉ॥ వజ్రపదంబు వద్దు ఘన♦వస్త్రసుబాహుబలంబులొద్దు యీ
ముజ్జగజన్మ మొద్దు కడు♦మూర్ఖులతోడ బ్రసంగమొద్దు నీ
సజ్జనమైత్రి కద్దు పలు♦సారులు నీభజనంబు ముద్దు యీ
రజ్జుల భ్రాంతులొద్దు రణ♦రంగభయంకర చెన్నకేశవా! ౧౬

ఉ॥ లాగకు నాదుమానసము ♦ లక్షలు ద్రవ్యము రాసిబోసినన్
బాగకు నాహృదిన్వదలి ♦ బంగరుసొమ్ములు భక్తులిచ్చినన్
జీగకు నాయెడన్గలుగు ♦ జిన్నవితప్పులు కొన్నియుండినన్
సాగకు నాదుపద్యములు ♦ చక్కగనమ్ముము చెన్నకేశవా! ౧౭

ఉ॥ నల్లనిఛాయ మేను ధర♦నారదు బాడినగానవేణువున్
పుల్లసుపద్మనేత్రుడును ♦ పుణ్యచరిత్రుడు బుద్ధదేవుడున్
చెల్లని చారుహారమును ♦ సత్యకిరీటము సద్గుణాంశమున్
మెల్లగ లోకము న్గరుణ ♦ మేలుగ బ్రోచెడి చెన్నకేశవా! ౧౮

ఉ॥ అంధునికద్దము న్గపట♦హాస్యుకు కావ్యము నాశ్రయించుటల్
బంధుదరిద్రకాంక్షులును ♦ పామును మేలునుగోరి పెంచుటల్
వంధ్యను వారకాంతదను ♦ వాదము జేసెడి వారి కామ్యమున్
నెంమనసనర్థమానుగద ♦ నిన్ను దలంచక చెన్నకేశవా! ౧౯

ఉ॥ కాలముచాలదయ్య ఘన♦కావ్యములెల్ల బఠింప నేర్వ నే
బాలుడ దూరుడ న్గపట♦పాపుడ చోరుడ జారుడ న్గ్రువర్

కాలుని జేరనీక నను ♦ కంజదళేక్షణ గావుమయ్య నీ
పాలను జేరిపాడ నెడ♦బాయకు శ్రీహరి చెన్నకేశవా॥ ౨౦

ఉ॥ భానునిరశ్మి పంక్తిధర♦పద్మములందున బారినట్లు నీ
సానువిక్షణంబు భువి ♦ సత్యసుభక్తులయందునుండగా
మానవకోట్లకెట్లు వర♦మానసమందున భక్తిలేక న
జ్ఞానమికెట్లుగల్గు హరి ♦ నాకును దెల్పవె చెన్నకేశవా॥ ౨౧

ఉ॥ పూచినపూతనీకు భువి ♦ పుణ్యులహృత్కమలంబులెప్పుడున్
గాచినపాలునీకు ఘన♦గానము జేసెడి మానవాగ్రజుల్
దాచినధాన్యమీవు ధర ♦ దాసులకెల్లను నిశ్చలాత్మతో
జూచిన నీవె సర్వమును ♦ సొంపుదలిర్పగ చెన్నకేశవా॥ ౨౨

ఉ॥ క్షీరసముద్రమధ్యమున ♦ శ్రీయుత నీవును శేషశయ్యపై
సారసనేత్రియున్ గసుల♦సద్గుణమంజరి సంతసింపగన్
మేరనుమీరుమోహమున ♦ మిక్కిలిమున్గుటచే బరాకునన్
దారినిదప్పజూచితివొ ♦ దగ్గర జేరవు చెన్నకేశవా॥ ౨౩

ఉ॥ మెండగుభక్తులీభువిని ♦ మేరనుమీరుచు నీకునుండగన్
నుండిన నేమి వీడు ధర ♦ నూడిన నేమని యూరకుంటివో
దండిగపాపముల్గలుగ ♦ దాసుడుగాడని తప్పజూచితో
వండినవంటగాదుగద ♦ వచ్చిన నీదయ చెన్నకేశవా॥ ౨౪

ఉ॥ దిక్కునులేనివాడ పర♦దిక్కును జూడనివాడ నేనిలన్
మ్రొక్కెదనీదుజాడ ధన♦మ్రొక్కును గ్రుక్కనిదాగుసీడ నిన్
మక్కువపూరిగూడినను ♦ మన్నుముగానపురాధ యేధరన్
జిక్కన నిన్ను వీడకను ♦ సేయుము శ్రీహరి చెన్నకేశవా॥ ౨౫

ఉ॥ అష్టమదంబులున్గలుగ♦వారును కామములంటియుండెనన్
నిష్టలుమూడు మోహములు ♦ నిందనుమూడుగుణంబులుండెయీ
కష్టములోర్వజాల నను ♦ కామ్యము బాయదుగాన నీవునన్
ద్రష్టనుముంచకయ్య నిను♦డాగితి శ్రీహరి చెన్నకేశవా॥ ౨౬

ఉ॥ పాకముమారిన న్మరల ♦ పక్వము జేసెడిబాట నేర్తుమే
కూకలుమారిన న్మరల ♦ గుజ్జులకైనను జెప్ప నేర్తుమే

తేకువ మారిన స్మరల ♦ దిన్నగ జేసెడి జాడ నేర్తుమే
సాకుము తండ్రి నన్ను ధర ♦ జక్కగ నిప్పుడె చెన్న కేశవా॥ ౨౭

ఉ॥ జన్మములెన్ని యెత్తితినొ ♦ జేస్పుచు పుట్టుచు సౌఖ్యమేరకన్
తన్మయ భ్రాంతి జెంది భువి ♦ దారసుతాదులలోన జిక్కియున్
మన్మధబుద్ధి నైతి హరి ♦ మాధవ మారకయుంక నైన నన్
జన్మము నీకజేర్చుకొను ♦ చేయ్యన నీదరి చెన్న కేశవా॥ ౨౮

ఉ॥ సూరిజనంబుల న్గరుణ జూచెడి దాతవు నీవుగాక కన్
వేరెల లేరటంచు ధర ♦ వేదము లేరులు బారుచుండగన్
క్రూరజనంబులు న్గుమతి కూతలు బెట్టుచు కొందరీయులన్
జాగలభాగి దేవతల ♦ జాటుచునుందురు చెన్న కేశవా॥ ౨౯

ఉ॥ మేడిఫలంబు జూడగను ♦ మేదిని సౌఖ్యసురూప మందియున్
వాడగ లోపల న్బదప ♦ పట్టివికీటక పంక్తులుంచుగన్
మూఢుల తేజము న్బలుకు ♦ మాఖ్యము భానుని కంత్రినొప్పి నన్
వాడను వారి వార్తలను ♦ వచ్చితి నీదరి చెన్న కేశవా॥ 30

ఉ॥ పద్మసుమంబున న్మధుప ♦ బాయక గ్రోలుచు తేటిపోల్పగన్
పద్మదళాక్ష నిన్బలుకు ♦ పాటలు నారదపంక్తులొప్పగన్
మద్భ్రమనీదు పాదముల ♦ మంగళకీర్తన మానలేక యూ
పద్మములందు నన్జొనుపు ♦ బాయక శ్రీహరి చెన్న కేశవా॥ 3౧

ఉ॥ అక్షయనామధేయ ధర ♦ యాశ్రితవత్సల రామభూవరా
రాక్షసశిక్ష కృష్ణ హరి ♦ రమ్యసుసిలశరీరశగ సి
కుక్షిన జాండపంక్తులను ♦ గూర్చి సమస్తము పోషణార్థివై
రక్షణ జేయుచుండగను ♦ రాజులు రెవ్వరు చెన్న కేశవా॥ 3౨

ఉ॥ ధారుణి దైవభక్తులను ♦ దండిగ నే శరణంబు వేడెదన్
మారక రామకీర్తులను ♦ మానస దీనత సంబుగొల్చెదన్
భూరితపో గజావళుల ♦ భూమికి జొచ్చెద యెప్పుడేయులన్
కూరిమి వారిలోన ధర ♦ కూటమియుందువు చెన్న కేశవా॥ 33

ఉ॥ గోవులవెంటనంటు ఘన ♦ కోడెలభంగియు నీకు యెప్పుడున్
తావును భక్తులందు యిల ♦ దాగొనియుందువు ధర్మవానులన్

సేవలుసేయు పుణ్యులకు ♦ చేకొనుమోక్షము దప్పదంచు మున్
ధీవర సజ్జనావళికి ♦ తీర్పును సేయవె చెన్నకేశవా॥ ౩౭

ఉ॥ కామలతాంగివై మెరిసి ♦ గ్రక్కున కండ్లకు కావరంబులన్
ప్రేమను దైత్యులన్మనిచి ♦ ప్రీతిని నిర్జరకోటిసంఘమున్
సామి దయామృతంబిడి య♦సాధ్యుల జేసిన సద్గుణాంశ నా
పామర పంక్తులన్దునుమ ♦ భారమునీదగు చెన్నకేశవా॥ ౩౮

ఉ॥ దంతిబలంబు యీమొసలి♦తావునజిక్కి కృశించి సొక్కి తా
నంతరమందు నిన్దలచి ♦ యీవరరూపము నెంచి యెంచియున్
జింతలమున్గి నిన్గనక ♦ శ్రీహరి గావుమటంచు వేడగన్
సంతసమంది బ్రోచితివి ♦ చయ్యనగావుము చెన్నకేశవా॥ ౩౯

ఉ॥ నాథులు యెవ్వరుండగను ♦ నాడల గోపతి కాలశక్తిచే
బాధనుజెంది వల్వలను ♦ బాయను క్రూరులచేతజిక్కియున్
మాధవ గానలోలయన ♦ మంగళవాక్యము నీవుపల్కవే
గాధనుమాన్పి నన్నటులె ♦ కావుము శ్రీహరి చెన్నకేశవా॥ ౪౦

ఉ॥ రక్కసుసూనునిన్ గడుసు♦రాణను సేయగ తండ్రిబాధకున్
మిక్కుటమందకన్ గమల♦మేదినిసోధసి నిన్ను వేడగన్
కక్కసకంభము న్వెడలి ♦ గ్రక్కసరక్కసిదున్మి బాలునిన్
చక్కగ నేలినావు నను ♦ సాక్షిగ బ్రోవుము చెన్నకేశవా॥ ౪౧

ఉ॥ కల్లజగంబులున్ గడుచు ♦ కాలముచూవునుదగ్గ రాహుతిన్
యుల్లమునందు బేర్కొనుచు ♦ యూరలుజూరుచు నీదునామమున్
కొల్లలు సేయువారికిని ♦ కూకలు యేటికి పాకపాయసం
బల్లనిమోక్షమున్ గలుగు ♦ సజ్జనమూకకు చెన్నకేశవా॥ ౪౨

ఉ॥ చెట్టయనాదినిన్వెదలి ♦ చేతులుయెత్తుచుపండ్లకై ధరన్
గట్టునుగట్టులన్ దిరుగ ♦ గానగవచ్చునె వానిభ్రాంతినిన్
గుట్టునుయోర్యులన్ గనక ♦ కూతలు నేర్చిన మోక్షమబ్బునే
దిట్టతనంబు మద్గురుడ ♦ నీరుడ బ్రోవుము చెన్నకేశవా॥ ౪౩

ఉ॥ కాయముకాలువాసనిది ♦ కండ్లను కామ్యపురాసు లీయిలన్
మాయము మందభ్రాంతులును ♦ మచ్చలుజేసిన మానవాతుల్ కృ

తీయము రామనామమును ♦ తిప్పలుమానవకోట్లనమ్మటల్
సాయమునిన్ను నమ్మటయు ♦ సద్గతిమార్గము చెన్న కేశవా॥ ౪౪
ఉ॥ పండినపంటయెట్లు ధర♦పాటినివారికిఁ జేరునో భువిన్
వండినవంటయెట్లు భువి ♦ వార్చినవారికి నైఖరోనుకో
దండినదాచినన్ ఘనత ♦ దైవమునీవుగ లోకమాకృతిన్
నుండినపాపమెద్ది నను ♦ నుర్విలొ బాయను చెన్న కేశవా॥ ౪౫
ఉ॥ నీళ్ళనుబాసినన్విరులు ♦ నిక్కనెయొక్కనిమేషకాలమున్
కాళ్ళనుబాసినన్నరులు ♦ కాశికిమార్గము గానవచ్చునే
దూళ్లనుబాసినన్పశులు ♦ ధూర్తతనంబునపాలనిచ్చునే
కీళ్ళనునీవుగాగ నిల ♦ కించితునాకెటు చెన్న కేశవా॥ ౪౬
ఉ॥ ఏపకుచేదుగల్గుటకు ♦ నెవ్వరు నేమియుదెచ్చిపోసిరీ
చూపులునీవుగాక నిల ♦ జూచుట కెవ్వరులోనజొచ్చిరీ
నీపనిగాక యీధరను ♦ నీతులకెవ్వరు బోధజేసిరీ
పాపము పుణ్యమీవు నను♦బాయుట ధర్మమ చెన్న కేశవా॥ ౪౭
ఉ॥ అందలమెక్కినన్ ఘనత ♦ యార్యులజేరసివారిజన్మముల్
సుందరమొప్పినన్ ఘనత ♦ సోహముసేయుసిమానవాగ్రజుల్
నందనమొప్పినన్ ఘనత ♦ వైఖరి శ్రీహరివాడుగాకనున్
తొందరజెందనేల యిల ♦ తోయపుబుగ్గకు చెన్న కేశవా॥ ౪౮
ఉ. పాటిన నీదుపాఠనము ♦ బట్టిన నీపదభక్తి యుక్తులన్
సాటెన నీదునామమును ♦ సద్గతిజేర్చిన నీదుసాంగమున్
మాటిన మానసావళిని ♦ మంగళకీర్తన సేయుచుంచుటల్
చీటిని నమ్మువారికిసి ♦ చిక్కను మోక్షము చెన్న కేశవా. ౪౯
ఉ. పూనకుమయ్య నిర్దయను ♦ భూసురపంక్తిని నేనుకోరనూ
మానకుమయ్య నాకుదయ ♦ మాధవ నీపదభక్తియిచ్చుటల్
దీనుడనయ్య సద్గతిని ♦ తీవ్రముజేర్చుము నీకు మ్రొక్కెదన్
భానునికోటిపంక్తి పర♦భాస్కర, శ్రీహరి చెన్న కేశవా. ౫౦
చ. కలలను గన్న యట్టి శుభ♦కామ్యములందున యంత భాగ్యమో
యిలనను మూర్ఖమార్గములు ♦ యించుక సౌఖ్యమదంతె కానకన్

మలినము పంకమందు బడి ♦ మానవళోట్లును సూకరాంగతిన్
మెలగుచు బుట్టుచుందు రిల ♦ మేలును గానక చెన్నకేశవా. ॥౧
చ. అలలను వార్ధినిన్గలుగు ♦ వాసిని సౌఖ్యమువచ్చుచుం డిలన్
నిలనుకపిద్ధము న్గజము ♦ యీనినమాట్కని బోవుచుండెడిన్
మలినము మాంసము న్గలిగి ♦ మారునుదేహము రోగపీడితన్
దలపను లోకవాంఛలను ♦ దప్పక బ్రోవుము చెన్నకేశవా. ॥౨
చ. మనవినియాలకింపు నను ♦ మానసగాలిచరింపు నీ దరిన్
వినయము జేర్చి యింపుకడు ♦ వీరసమార్గము చేంపు నీవు నన్
ఘనరసవార్ధి నుంపు దయ ♦ గానము సొంపు ఖలింపు శ్రీ హరీ
మును కొను శత్రులాగ్గరను ♦ మూలము చెంపుము చెన్నకేశవా
చ. మరిమరి చూడకయ్య నను ♦ మానసనిగ్రహ మధ్యనయ్య యా
సురమునివర్గులైన నిను ♦ జూచుట కర్హ్యమునొంద రైరిగా
దురితభవాంధము న్పడిన ♦ ధూర్తుడ ని న్నిటు నేను గాంతు నో
పరిపరితాపము న్గలిగె ♦ బాయకు శ్రీహరి చెన్నకేశవా. ॥౪
చ. కటకట నాకుమానసము ♦ గాల్చిన కామము కింపమొం దిలన్
చిటచిటచిందుల న్గొనుచు ♦ చిచ్చును బెట్టిన వేణువాక్కృతిన్
పటపట నీదు భక్తి యను♦బంధలతాన్మయజుట్టి యెప్పుడున్
మటమటమట్టి నా మనసు ♦ మార్గము నిల్పుము చెన్నకేశవా. ॥౫
చ. ఉరుములు చీకటిన్గలుగ ♦ నొక్క యరణ్యమునుండు వానికిన్
పరులను బాటయు న్గనక ♦ బాయని దుఃఖమునొందినట్లుగన్
ధరణిని జన్మ మెత్తితిని ♦ దాట నుపాయము గానరాదు గా
శర ణిదె సారసాక్ష నను ♦ చక్కగ బ్రోవుము చెన్నకేశవా. ॥౬
చ. మిసమిసలాడు మేకలను ♦ మిక్కుట నక్కయు మెక్కినట్లు గా
రసమగు నీదు నామమున ♦ రంగము నొందుచునుండ నామదిన్
పసగల నాతులు న్కుమతి ♦ బాటలు జేర్తురు భంగ మొందకన్
రసికయు పూతవృత్తి నను♦ రాసిని నుంచుము చెన్నకేశవా. ॥౭
చ. తనయులకీర్తి తండ్రికిని ♦ దంతి యశంబును మావటీనికిన్
వినయము కూతుమాతకును ♦ వీరసుమంత్రియు రాజధానికిన్

సుకము నీకు భక్తులు ♦ గావక నీపిడ నీకు కీర్తియుఁ
మనమున నిన్ను నే దలతు ♦ మాధవ నీదయ చెన్నకేశవా ౧౮
చ. కులగిరు లెన్నియేనియును ♦ కూటనజేసిన యాంజనేయునిఁ
మలినమునందున న్బొరలి♦మానసవచ్చిన వృద్ధజీవునిఁ
విలసితమంది యేహ్యాఫల ♦ మిచ్చిన నాతిని యెన్నుతగ్గులఁ
వలగొని వక్కరీతిగను ♦ వైఖరి బ్రోవవె చెన్నకేశవా. ౧౯
చ. కనకముమారి సొమ్ములిం♦కారులు బారులు దీరినట్లుగఁ
మనసున భేదమున్ననగ ♦ మాధవ నక్కరు నీవు లోకముఁ
మనసినమాన్చిన న్గుదకు ♦ మాడదె చారుసురూపమంతయుఁ
గనుగొన నల్లె నున్నవను ♦ గాథను బొందెను చెన్నకేశవా. ౨౦
చ. ధరణిని మోలి దానమును ♦ దారవ్రతాంశము దప్పకుండుటఁ
భరమును నబ్ధిపోలికను ♦ భావము చంద్రుని పావనావళిఁ
పరముచకోరమాటిక్కియును ♦ భద్రముకొండనుసర్వమాంద్యముఁ
నిరతము నుంచువారికిని ♦ నిక్కము మోక్షము చెన్నకేశవా ౨౧
చ. పరిపరి నిన్ను బాడుటకు ♦ భక్తియు గల్గిన నారదుండు నా
శరణని దప్పుచేకుటకు ♦ శక్తి విభీషణబుద్ధిశాలి నా
మరువక చింతసేయుటకు ♦ మానసము ద్రౌపతి మాల్యవంతినా
నరుడను బంధు డన్కనుతి ♦ న న్నిటు బ్రోతువో చెన్నకేశవా.
చ. సుతులును నేరక ఘ్నసము ♦ శూరపుమాటలు బల్కినట్లుగఁ
పతియని సత్ప్రవర్తనుల ♦ భాయక, వ్రేతలు గోరినట్లుగఁ
హితుడని ప్రేమభాగ్యముచు ♦ యుంచుక కొందరు గోరినట్లుగఁ
మదియును నాకు గల్గె నిల ♦ మాధవమోక్షము చెన్నకేశవా. ౨౩

తనయుల కోర్కె లిచ్చుటకు ♦ తండ్రికి వేడుక గల్గినట్లుగఁ
ఘనముగ భక్తకోటులకు ♦ గామ్యము మోక్షము నీకు యీవగఁ
మనమున జూచుచుండునట ♦ మాధవ నీకును మర్త్యమందునఁ
వినయము వేదసార మిది ♦ యిచ్చెలుగా దిల చెన్నకేశవా. ౨౪
చ. కులమును భోగ్యము న్గనక ♦ గూర్చియు నిన్ను దలంచువారికిఁ
ఫలమును మోక్ష మిచ్చునట ♦ బంధము బాసియు పార్థివాకృతిఁ

సలలిత దానకంకణము ♦ చాటుచు నుందువు సద్గుణార్యులున్
యిలనను నీతులన్గనక ♦ యిత్తువు మోక్షము చెన్నకేశవా. ౧౫
చ. సలిలము నీదు రూపమట ♦ సర్వచరాచరపంక్తి కోటికిన్
జలమును లేక యెప్పుడును ♦ జక్కగ నిచ్చట నైన నుండెనా
వలగొని నీదు రూపమున ♦ వైఖరి లోకము లెల్ల నుండగన్
పలువరిమార్గము స్బడితి ♦ బాటలు నేనని చెన్నకేశవా. ౧౬
చ. శమనునిదూతలొచ్చి యిట ♦ చయ్యన రమ్మని సాగదీయగన్
తమమున లోకవాంఛలును ♦ దాటగజాలక దారి లేకనున్
శ్రమమున దిక్కులన్గనిన ♦ సాయము చేయుట కెవ్వ రొత్తురే
మమతలు వాంఛలు స్మరతు ♦ మద్గతి జూపవె చెన్నకేశవా. ౧౭
చ. మలినపు మంద నైతి ధర ♦ యాటలరాగము బాల్యమందునన్
వలలను జిక్కియుంటి కదు ♦ యవ్వనమందున జారవాంఛలన్
పులులగు యీషణంబులను ♦ పూతను నుంటిని మూఢవార్ధినిన్
బలమును భాగ్యము న్విరిగె ♦ బాయకు శ్రీహరి చెన్నకేశవా. ౧౮
చ॥ మునులకు తేజమున్ జగము ♦ మూఢులగాలము చక్రజాలమున్
ఘనులకు శంఖనాదమును ♦ కల్మషదూరులగాల్చుశబ్దమున్
అనిశము ఖడ్గశూలగద ♦ యార్తులరక్షణ సేయుచుండగన్
మునుకొని దాల్చియుంటివట ♦ మోసము సేయకు చెన్నకేశవా॥ ౧౯
చ॥ కమలయుభోగ్యమిచ్చుటకు ♦ గానము వాణియు కార్యకంకణం
తమమును బాప నీదయయు ♦ దాసుని భీతికి యాంజనేయునిన్
విమలము సేయ పాపముల ♦ వీరపరాన్మయనీదు నామమున్
సమమున దాల్చియుంటివిల ♦ సద్గతిమార్గము చెన్నకేశవా॥ ౨౦
చ॥ బిరుదులు తేటయున్ గపట ♦ భీకరవృత్తులు లోకమందరున్
సరములు కాంతియున్ గపట ♦ సాగములోపలనుండు టీయిలన్
కరమున కంకణంబిలను ♦ ఘుట్టిగ గల్గినరమ్మనీవిటన్
సరములసారమైన ధర ♦ చాటునదాగుము చెన్నకేశవా॥ ౨౧
చ॥ ఇనకులసాంద్రవై వెలసి ♦ యీవిద్యముతోడను రాక్షసావళిన్
మనములనుక్కడంచి యిల ♦ మాధవనీదయ రామనామమున్

జనులకు పాపసంఘములు ♦ జక్కఁగబాపనులోకమందునన్
వనజనాభనిల్పితివి ♦ వక్కనిగావుము చెన్నకేశవా॥ ౨౨
చ॥ కరులకుసింహమగ్రమును ♦ కాశికిపాలసముద్రమగ్రమున్
విరులకు యింతులగ్రమును ♦ యిచ్చకుమతిత్యాము యగ్రమాకృతిన్
సరులకుచంద్రుడగ్రమును ♦ సత్యములోకముసర్వమగ్రమున్
సురలకు రుద్రధాతలకు ♦ జూడగనీవుచు చెన్నకేశవా ॥ ౨౩
చ॥ అరమర సేయబోకు పర♦యావరణంబును నాకునుండగన్
ధరణియు నాదుబాటలకు ♦ ధర్మసుశీలము డాయకుండునా
వరములునీవుయిచ్చినను ♦ వైఖరిజేర్చుము నీదులోకమున్
శరణిదె యన్యమున్ దెలియ♦జాలను శ్రీహరి చెన్నకేశవా॥ ౨౪
చ॥ కపటపునాట్యమున్ గొలిపి ♦ కార్యమునీవునుగాన రాకనున్
చపలమునాకుయొంచితివి ♦ చర్యలు నేనెటుజేసియుంటి నీ
విఫలము నాను పాపములు ♦ యించుక నాయెడసత్యముండినన్
నుపములునీవులేక నను♦యూరలుగొల్పున చెన్నకేశవా॥ ౨౫
చ॥ తరువును నీడయాతరువు ♦ దాటియు నన్యముజెందబోవు నా
సఖలును కతనుస్విడిచి ♦ సారెకుయింకొకచోటికేగు నా
కరులకు మేనుయుండగను ♦ గొహముమారుటగానవచ్చునా
ధరణియు నీవుగాక నను♦డాయున పాపము చెన్నకేశవా॥ ౨౬
చ॥ తపమును సేయజాల ఘన♦దానము ధర్మము శక్తి లేదిలన్
యుపములునాకుదోచ విల ♦ నుండగజాలను యొక్కప్రొద్దులన్
చపలమొ నాదుమానసము ♦ చయ్యను మార్గమొ నాకుదోచదే
యిపుడును నిన్ను జేరితిని ♦ పీడకు శ్రీహరి చెన్నకేశవా॥ ౨౭
చ॥ పశువులమేపుబాలురకు ♦ బాటలయాటలకాలమాకతన్
యశమును ధాతృదండనము ♦ యాగ్గురుశత్రులలోన జిక్కియున్
శిశువులభంగినుంటి ధర ♦ చీకటిలోబడి చింతలందుచున్
వశమును జేసికొమ్ము నను ♦ వైఖరి శ్రీహరి చెన్నకేశవా॥ ౨౮
చ॥ పలికెడిపద్యమీవు సుర♦భక్తియునీవును బాయకుండగన్
కులికెడితావునీవు జన♦కూర్మినిగొల్పెడి గురునీవు నా

కలిమినిమాపునీవు ధర ♦ కాంతలుజూపెడికాలమీవయుఁ
పలువరిమాటలేల నను ♦ పాపముపంటను చెన్నకేశవా॥ ౭౯

చ॥ అదరను నీవునన్ను ఘన ♦ యాపదలందున బెట్టియుంచినఁ
బెదరను కాలదూతలకు ♦ పేర్మిని నీవును నన్ను పంపినఁ
గుదురనులోకవాంఛలను ♦ గూఢపుమార్గము నాకునిచ్చినఁ
జెదరకనీదునామమున ♦ జేర్పుము శ్రీహరి చెన్నకేశవా॥ ౮౦

చ॥ పదపడినీదుభక్తులకు ♦ బాటవికుంఠము బాపుచుండగఁ
సదనముగాన వాంఛలకు ♦ సద్గతినీజము చాపుయంశముఁ
ముదమునమానవీమటకు ♦ ముఖ్యము యోగ్యుల జేరియుండుటఁ
మదమునుపీడ జేసి నను ♦ మన్నుము శ్రీహరి చెన్నకేశవా॥ ౮౧

ఉ॥ ఉట్టివిగాదుయెక్కుటకు ♦ యూర్థ్వముఖంబగుబాటసాధ్యమా
గిట్టునుగాముదాటుటకు ♦ గానసునాదముబట్టసాధ్యమా
వట్టివిగాపుమాటలను ♦ వైఖరి శ్రీహరిభక్తిసాధ్యమా
గుట్టునుగానలేను నిను ♦ గూర్చిదలంచెద చెన్నకేశవా॥ ౮౨

ఉ॥ అల్లురమేలుజేసినను ♦ యాశలమేరకునంతముండునా
కల్లునుద్రావువానికిని ♦ కయ్యము చేరికగాకయుండునా
తెల్లులగొట్టువానికిని ♦ తప్పక చేటులుగల్గకుండునా
కొల్లగ నిన్నుగొల్వకను ♦ కోరికలబ్బున చెన్నకేశవా॥ ౮౩

చ॥ తరువునుగాలిసోకినను తాచును నేటియుదండ జూచినఁ
పరువునుమారిపోయినను ♦ పాపులసాంగముబట్టి జేసినఁ
నిరువునుమారి కోపమును ♦ నింతులచింతలబెట్టువానికిఁ
తరుణులమన్యులఁగలియ ♦ తప్పదుచేటును చెన్నకేశవా॥ ౮౪

న॥ గురువులచేరిగొల్చినను ♦ కూరిమిమాతను పితృపోషణుఁ
సురలకుమేలుజేసినను ♦ నారిజనావళినూటిసాంగముఁ
పరమగుశాంతిదాల్చినను ♦ పశుముభావము బారకుండినఁ
తగుణుల డావకుండినను ♦ తప్పనుసౌఖ్యము చెన్నకేశవా॥ ౮౫

మ॥ గరుడారోహణమున్నజీవులకు సద్గాడంధముఁ బాపగఁ
పరమాశాసనము న్నగోత్తమును సద్భావంబునీవంచు నిఁ

ధరులామాటలుబల్కుచుంటిరిల త♦త్త్వార్థంబు సంబోధకుల్
స్థిరమార్గంబున నన్ను నుంచుము యిలన్ ♦ శ్రీ చెన్న కేశాన్వితా। ౧౬

మ॥ అవమానంబులు మానరానైతినిక త♦త్త్వార్థంబు యెట్లబ్బునో
భువిలోకోర్కులుదీరవయ్యె మనమున్ ♦ భూనాథ లెట్లోర్తునే
దివిప్రాకంగను దీక్షబుట్టనుగదున్ ♦ ధీరాశ నాకిట్టులన్
శివదా సన్నుత ప్రోవవయ్యదయతో ♦ శ్రీ చెన్న కేశాన్వితా॥ ౧౭

మ॥ నరులందు న్సురలందు భూసురులనున్ ♦ యాలాపము న్ద్వేషమున్
సరివారెవ్వరు లేరటంచు మదిలో ♦ సంతోషమ సయ్యాటలన్
పరివారంబున నన్యులందరిని నే♦పాటించి పాపాత్ముడై
శిరిరామత్తుడనైతి నేనికవిడన్ ♦ శ్రీ చెన్న కేశాన్వితా॥ ౧౮

మ॥ తమవారెవ్వరు తాము లేమనుచునున్ ♦ దాసోహ సంధానునున్
విమలన్బోధలు బల్కుచుండగను నే♦విశ్రాంతి దూషించియున్
శమనక్కింకర బాధలున్గలుగగన్ ♦ సద్గోష్ఠి నే జేరితిన్
శివుడా మృత్యువు నేమి సేయునికనన్ ♦ శ్రీ చెన్న కేశాన్వితా॥ ౧౯

మ॥ నరలోకంబును నమ్మువారికిని న♦ర్థార్థంబు సంప్రాప్తమౌ
సురలోకంబును జేరువారికిని శు♦ష్కోపద్రవంబున్మరిన్
పరలోకంబును బొందువారికిని స♦ద్భాగ్యంబు యేకంబునున్
శిరియానామము సిద్ధియే యిలకునున్ ♦ శ్రీ చెన్న కేశాన్వితా॥ ౨౦

మ॥ పనిగా బూసిన నీదు భక్తులకునున్ ♦ పట్టార్తి యింకొక్కటిన్
మనమున్ గానగ చేదు ధూర్తులకునున్ ♦ మార్గంబు గేరెట్టిలన్
తనలో యంతరధర్మమున్ దలపగన్ ♦ దాసోహమున్ గల్గినన్
వినుమా శ్రీహరి నీవు బాయవుగదా ♦ శ్రీ చెన్న కేశాన్వితా. ౨౧

మ. కలియాలోకనగాన వత్తురుగదా ♦ కల్యాణయాశావళిన్
నలినాక్షా నినునట్లు నర్థిమనమున్ ♦ నాథా తిన్ గాపించిచిన్
బలురోగంబులు పాపసంఘములను ♦ న్బాధా స్తిబోకుండనే
శిలలాగోచనునైరిలన్నరులునున్ ♦ శ్రీ చెన్న కేశాన్వితా. ౨౨

మ ననుజూడంగను ప్రేమబుట్టదుమది ♦ న్మద్భాగ్యమెట్లున్నదో
మును నే జేసిన మూర్ఖమార్గములునున్ ♦ మున్దొక్కి రానివ్వవో

చనువారందరు మార్గమిద్దియనుచుఁ ♦ జాడైనఁజూపింపరా
చెవకఁ జూడకనన్నుఁ గావగదవే ♦ శ్రీచెన్నకేశాన్వితా. ౯౩

మ. కడుదీను న్మనసారనిన్పరిహరిఁ ♦ గాఢార్తిఁ జేవేడఁగఁ
బడి మ్రొక్కంగను పాటిసేయకయిలఁ ♦ బాధంబులఁ గూర్తువే
వడిగా రమ్మిటు వాసుదేవ జడుఁడ ♦ వ్యాసాదిసంవేద్యరా
శిడిరక్షింపను నీవునాశ్రయమునఁ ♦ శ్రీచెన్నకేశాన్వితా. ౯౪

మ. పరిపాలించినవారిలోకమున నీ ♦ ప్రఖ్యాతిజెప్పంగ నే
పరితాపంబున నిన్ను వేడితినిల ♦ న్పాటించి రావయ్యయో
యురగేంద్రాశయ నేను వక్కడగదా ♦ యుర్వీస్థలిన్నాభరమా
సిరితోనుండినవారికేసిరులునా ♦ శ్రీచెన్నకేశాన్వితా. ౯౫

మ. అపరాధంబులనెంచకయ్య పుడమిఁ ♦ యార్భాదినాబోటికిఁ
యుపమానంబులు జాస్తిలేమియుకదుఁ ♦ యుష్మత్పదార్థంబునుఁ
చపలాంశంబున నేరనైతినిగదా ♦ శాఖోపసాపంబులఁ
శివకోపుండవిరాకయుంటివిగదే ♦ శ్రీచెన్నకేశాన్వితా. ౯౬

మ. బిరుదాలోకనబీదవారికిగదా ♦ భీభారడంభోక్తికా
సిరిదాలోకనభక్తవత్సలగదా ♦ శ్రేయాంశసంతోషికా
కరదానాంశము కాలుబాటనరుడుఁ గాంక్షించసీవెట్టులఁ
సిరిదానాంశముజేయుచుందువిలలో ♦ శ్రీచెన్నకేశాన్వితా. ౯౭

మ. గురియార్యాంశము నిల్పగల్గినధరఁ ♦ గుర్తించుదునీవచ్చుచో
నరులామాటలుబల్కుచుందురుగదా ♦ నానోష్ఠనేపుట్టినా
పరమాలాపనసేయుచుందునుగదా ♦ భక్తాళిసంరక్షణా
శిరిశేష్టావళి నాకు లేపునుగదా ♦ శ్రీచెన్నకేశాన్వితా. ౯౮

మ. వడిగా రమ్మని నిన్ను జేరుటగదా ♦ వైకుంఠసర్వేశ్వరా
సుడిగాజుట్టితి వయ్యయో మొదటికిఁ ♦ చూడంగ జోద్యంబుగా
బడగాజాలను సీ దయన్మనుపవే ♦ బాధల్నివారించి, నే
చెడిన నీకీర్తియు సీదెగా ధరణిలో ♦ శ్రీ చెన్నకేశాన్వితా. ౯౯

మ. బలుపాపంబుల బద్ధుడైతిగదవే ♦ పల్మారు దుశ్చింతలున్
కలలోనైనను యాశబంధములునఁ ♦ కాసంతయున్వీడ వీ

యిలలో నేమియు మున్ను జేసితిని నా • కీ జ్ఞానమార్గావళిన్
శెలయేళ్ళానతియిచ్చితీవు మనమున్ • శ్రీ చెన్న కేశాన్వితం. ౧౦౦

మ. కనువారెవ్వరు మున్ను ధాతసురలున్ • కాంక్షించి నీమాయలున్
గనగాలేకను బద్ధులయ్యిరిగదా • కల్యాణసంధాయకా
నిను నే గన్గొన నెంతవాడను హరీ! • సిక్కంబుగా వేగమే
శెనిమార్గావళి కోసివేయదగవే • శ్రీ చెన్న కేశాన్వితా. ౧౦౧

మ. కలివారల్పదిమార్లు నన్ను దలపన్ • కాంక్షా త్రిభాషించియున్
యిలలో శ్రోతును వేమరున్నదియునున్ • యీ లోకప్రావీణ్యతం
మలినా వేశము మంచిదన్చు నిపుడున్ • మద్భావ్యము నృల్కవే
శిలలే శ్రేష్ఠము యీయుగంపరుణకున్ • శ్రీ చెన్న కేశాన్వితా. ౧౦౨

మ. ఇతరాలోకనలేకను స్మనమునన్ • యార్ష్యంబు లేకుండగన్
మతభేదంబులు గాంచక స్మమతలన్ • మర్యాదశీలంబులన్
హితవున్గోరని సద్వ్రతంబులిరువున్ • యింప్రాప్తి నా కివ్వమా
శ్రిత వత్సార్తిని శ్రీహరీ విడువకన్ • శ్రీ చెన్న కేశాన్వితా. ౧౦౩

మ. మధుపద్మావళి తేటి బాయుటకును • స్మర్యాదగన్పట్టు నా
మధురాలాపమునూనుకుజ్జకులు • స్మర్లింపగా జాతుమా
అధమార్గావళి యెట్లు బొందుదురిలన్ • యార్యాంశనీదాసులున్
శిధిలంబౌనఘసంఘమున్దురితమున్ శ్రీ చెన్న కేశాన్వితా. ౧౦౪

మ. ఘనప్రజ్ఞావళిగానపానమతులన్ • కల్యాణము న్గోల్వగా
వినయాసక్తులు సంతసం బొదవగన్ • యెవ్వేళ కాంక్షించగా
జననాధోత్తమ నీకు మ్రొక్కెదయిలన్ • జాగర్త నా కివ్వమా
చినుగా మ్రాకులరీతి సేయక ననున్ • శ్రీ చెన్న కేశాన్వితా.౧౦౫

మ. పులిసింహంబును గెల్వనౌన బలమున్ • పూనాస్తి లేకుండినన్
బలు దారిద్ర్యము బాపనౌన కమల•స్వంతంబు వాటిల్లియున్

గులకామ్యంబులుగొల్పనౌన హాళినిక్ ♦ కాంక్షించి సేవించరక్
శిలలీమానవులార్తినొందరుగదా ♦ శ్రీ చెన్నకేశాన్వితా. ౧౦౬

ఉ. సంగడిలోకసృష్టి నిది ♦ సంగడిభర్తయు సర్వశ్రీలకున్
సంగడిరాజురాష్ట్రమున ♦ సంగడి వహ్నియు స్వర్గమోహులకున్
సంగడినార్యశిష్యులకు ♦ సంగడిసత్యము సర్వజేతకున్
సంగడి నీదు నామమును ♦ సద్గతిమార్గము చెన్నకేశవా. ౧౦౭

ఉ. పన్నగశాయి మంగళము ♦ భక్తుల హృద్యగపార్ధ మంగళం
సన్నుతిసారమంగళము ♦ సంతతరావురిసామి మంగళం
పున్నమగుణ్యమంగళము ♦ పూర్ణదయానిధిరామ మంగళం
జన్నముకర్తమంగళము ♦ శాశ్వతశ్రీహరి నీకు మంగళం. ౧౦౮

ఓం శ్రీ పరబ్రహ్మార్పణమస్తు.



సంతరావూరియందు లోకరక్షణార్థంబు శ్రీ లక్ష్మీసమేతంబుగా నూతనముగా సుక్షేత్రంబుగా వేంచేసియుండే శ్రీలక్ష్మీచెన్న కేశవస్వామి వారివల్ల కొన్ని కొన్ని శుభంబులు పొంది వర్షాచలకైంకర్యపరులయి యున్న వారల నామములు.—

బెజవాడ.

1. దోంతరాజు వెంకటప్పయ్య } శ్రీ స్వామివారి కల్యాణవుత్సవములలో యొకటి జరుపుచున్నారు.

నైజాం ఖమ్మంమెట్టు.

2. మిల్లచెరువు రామయ్య, లక్ష్మీనారాయణగార్లు — డిటో.

3. చీరాల.—శిఖాకొల్లి లక్ష్మయ్య — డిటో

4. వేటపాలెం.—పొన్నూరివీరరాఘవస్వామి, — మరియొక కైంకర్యం

5. జమ్ములపాలెం.—తిమ్మిరెడ్డి జయరామరెడ్డి, — డిటో

6. గ్రామస్థులు — మిగత కల్యాణవుత్సవములు జరుపబడును.

సూరవరపుపల్లె
అనంతవరం
నాగళ్లరవివారిపాలెం
పరిటాలవారిపాలెం
తిమ్మరాజుపాలెం
ఖమ్మంమెట్టు
సంతరావూరు

} యీ గ్రామములలో శ్రీ స్వామి వారికి నిత్య కైంకర్యముక్రింద యిల్లు 1కి రు 1-8- చొ॥ వర్షాశనం యివ్వబడును. చందాదార్ల పేర్లు ప్రతిసంవత్సరము పత్రికలు వేశి పంపబడును.

ఇకమీద నిత్యకైంకర్యములుబూనువారి పేరులున్నూ గ్రామములున్నూ శ్రీస్వామివారుఆనతిచ్చిన మోక్షప్రసాదంబను ప్రబంధంబు అచ్చువేయునపుడు అందున ప్రచురింపబడును. ఈలోకంబునందు నరజన్మంబెత్తి యితర జీవులవలె కాలము వ్యర్థంబా యొనని పరిజ్ఞాతగల్గిన బుధసత్తములును, ఇహ పర సౌఖ్యంబులున్నూ నిత్య సుకీర్తియున్ను పొందనేర్చినవారలున్ను నూతన శ్రీహరివీక్షణాలంకారంబైన శ్రీ సంతరావూరి పుణ్యక్షేత్ర మాహాత్మ్యంబుదరిజేరి, గాంచి, సుఖింతురుగాక.

---

సదరు పుస్తకములువగైరాలు కావలసినవారు బాపట్లతాలూకా, వేటపాలెంపోస్టు, సంతరావూరుగ్రామంలో శ్రీమాన్ దిట్టకవి తిరుమలయ్యలవారి పేర వ్రాసి తెప్పించుకోవలయును.